

# స్త్రీ నిజస్థితి

(మూలము: శ్రీమాత)



ప్రకాశకులు :

తెలుగుశాఖ

శ్రీ అరవింద సొసైటి

శ్రీ అరవిందాశ్రమము, పుదుచ్చేరి-605002.

# శ్రీ మాతృస్తోత్రమ్

అఖిలాండకోటి బ్రహ్మాండజననీ, పరదేవతా, మిరామాత!
లోక ధాత్రీ! జగన్మాత! ప్రేమరూపా! క్షేమంకరీ: ఈశ్వరీ!
అదితిర్దేవమాతా! ఆదిశక్తి రమేయాత్మా! పరదేవతా, మిరామాత!
సర్వాధార! నిజాకృపాపూరమజ్జద్బ్రహ్మాండమండల పదారవిందా!
సకలామర గణానంత దివ్యతేజోప్రసారకిరణముల
ధరణిపై నొక నూతన జాతిగ జననమొందింది, ధైర్యసాహసోపేత
దివ్యజీవన పూర్ణయోగ సాధనచే నీ దివ్యశక్తినిట వ్యాప్తి జేతుము.
ఒక నవ మానవత, ఒక సుందర సుకుమార నవజాతి —
కనులందు నీ దివ్య నయనారవింద పరమ ప్రశాంతి కిలుగు.
నీ బిడ్డల నెల్లర తీర్చిదిద్దుకొనుమమ్మ, క్రమశిక్షణతో.
నీ దివ్యపూర్ణయోగసాధనలో మాతృమంత్ర దీక్షనిమ్మ జనని.
శాంతికరములు, దీప్తిమంతములు నీ మధుర
మంజుల దివ్యవాక్కులు మా ధ్వజముపై నిల్పి
శిఖరాగ్రముల శీఘ్రముగ పయనింతుము.
దృఢహృదయులమై మా గమ్యము చేర
ఆదర్శ నవజీవన నిత్యసాధనా కృతనిశ్చయులమై యుందుము.
నీ దివ్యపాదసన్నిధిని ప్రణమిల్లి వచ్చిన ప్రపన్నార్తులము
సతతము నీ చరణముల శరణు వేడుకొందుము కరుణామయీ.

(కవరు 3వ పేజీలో)

# స్త్రీ నిజస్థితి

శ్రీ మాత





ఆంధ్రీకరణ:

శ్రీ వెంపటి కృష్ణమూర్తి, ఎమ్. ఎ.,

# విషయసూచిక





★ ★ ★



*A sealed identity within her woke;*
*She knew herself the Beloved of the Supreme:*
*These Gods and Goddesses were he and she:*
*The Mother was she of Beauty and Delight,*
*The Word in Brahma's vast creating clasp,*
*Tha World-Puissance on almighty Shiva's lap,–*
*The Master and the Mother of all lives*
*Watching the worlds their twin regard had made,*
*And Krishna and Radha for ever entwined in bliss,*
*The Adorer and Adored Self-lost and one.*

*(SAVITRI)* — *SRI AUROBINDO*



జననీ దుర్గా! హే కాళీ, దిగంబరీ. కపాలమాలాలంకారిణీ. ఖడ్గపాణీ. అసురసంహారిణీ. భగవతీ! నీ నిర్దాక్షిణ్యాట్టహాసములతో మాలోని వైరులను హతమార్చుము. యే ఒక్కరిని మిగల్చక. వారినందరిని మొదలంట నిర్మూలింపుము. మేము నిష్కల్మషులము. నిర్మలులము కావలయుననియే యీ మా ప్రార్థన. ఓ తల్లీ ఆవిర్భవింపుము.



శ్లో॥ ఉల్లాసయన్ కువలయం ధవళస్మితేన
నిఘ్నన్ తమాంసి మహిసా తపనేక్షితేన ।
ఆగామిచిత్రబహుళః కుశలం దధానః
శ్రీమాన్ విభాతి భగవానరవిందనాథః ॥

సంకల్పాత్మకంగా రూపాన్ని ఇచ్చినప్పుడు, ఒక ప్రాణిని చేతన స్ఫూర్తితో సృజించినప్పుడు నిజమైన మాతృత్వం అంకురిస్తుంది. స్త్రీలయొక్క వాస్తవ రంగము ఆధ్యాత్మికమైనది. ఈ విషయం మనము తరచుగా మరచిపోతూనే ఉంటాము.

ఇంచుమించు జడప్రాయంగా ఒక శిశువును గర్భస్థంచేసి దేహాన్ని నిర్మించినంత మాత్రంతో సరిపోదు. ఒక ఆదర్శాన్ని వెలువరించగలిగిన శీలంతో ఉన్నవారిని ఆలోచనా సంకల్ప బలంతో అంతర్నిహితులుగా చేసి సృజించ గలిగిననాడే మనము చేయవలసినపని నిజంగా ప్రారంభమైనట్లు చెప్పుకోవాలి. "అంతటిదానిని కార్యరూపంలోకి తీసుకువచ్చే శక్తి మాకు లేదు" అని చెప్పవద్దు. "ఇంతటి కార్యసాధకశక్తి ఉన్నది" అని ఋజువుచేసే తార్కాణాలు చాలా ఉన్నాయి.

చాలాకాలం క్రిందటనే భౌతిక వాతావరణ ప్రభావాన్ని పరిశీలించి గుర్తించడం జరిగిందన్నది ఇందులో మొదటి విషయం. వనితలచుట్టూ కళా సౌందర్యరూపాలను ఉంచి, నెమ్మది నెమ్మదిగా, గ్రీసుదేశములోని ప్రాచీన జనులు అసాధారణ సామరస్యం కల జాతిగా తమ్ముతాము రూపొందించుకొన్నారు.

ఇదే విషయానికి వ్యక్తిగతాలైన ఉదాహరణలుకూడా చాలా ఉన్నాయి. గర్భవతిగా ఉన్నప్పుడు ఒక మనోజ్ఞచిత్రాన్నిగానీ, విగ్రహాన్నిగానీ నిరంతరంగా చూస్తూ, ప్రశంసిస్తూ ఉన్న ఆమె చిత్రంతోనో, విగ్రహంతోనో సంపూర్ణ సామ్యంఉన్న శిశువును కనడం అపురూపమైన విషయంకాదు. నేనే ఇటువంటి సంఘటనలు చాలా ఎరుగుదును. ఈ సందర్భంలో ఇద్దరు బాలి

కలు నాకు చాలాస్పష్టంగా జ్ఞాపకమున్నారు.. వారిద్దరూ కవలపిల్లలు. ఎంతో అందంగా ఉండేవాళ్లు. కాని మరీ ఆశ్చర్యమేమిటంటే వారికి తల్లిదండ్రుల పోలిక ఏ మాత్రమూ లేకపోవడమూ, "రేనాల్డ్స్" అనే ఆంగ్ల కళాకారుడు సృజించిన ఒక ప్రసిద్ధ చిత్రానికీ వారికీ దగ్గర పోలిక ఉండడమూ ఒక రోజున ఈ మాట వారి తల్లితో అన్నాను. ఆమె ఆశ్చర్యపడి వెంటనే "నిజంగా అంతేకాదూ! చమత్కారమేమిటంటే ఈ పిల్లల కాన్పుకి ముందు నేను పరుండే తల్పానికి పైన "రేనాల్డ్స్" వేసిన చిత్రానికి ప్రతిరూపం ఒకటి చాలా చక్కనిది, వ్రేలాడుతూ ఉండేది. నిద్రపోయేముందు చిట్టచివరిసారిగా నిద్రలేవగానే మొట్టమొదటిసారిగా ఆ బొమ్మనే చూస్తూఉండేదాన్ని. అప్పుడు నా హృదయంలో 'ఈ చిత్రంలో ఉన్న ముఖాల వలెనే నా పిల్లలుకూడా ఉండాలి' అని ఆశపడుతూ ఉండేదాన్ని. నేను ఆశించినట్లే చాలావరకు జరిగింది గదా: అన్నది. తన ధన్యత్వానికి ఆమె నిజంగా గర్వపడవచ్చు. ఆమె పెట్టిన ఒరవడి మిగిలిన స్త్రీలకు ఎంతో ఉపకరిస్తుంది.

మృదుత్వం చాలా తక్కువగా ఉన్న పరికరాలతో నిండిన భౌతిక రంగంలోనే ఇటువంటి ఫలితాలను మనము పొందగలిగినప్పుడు ఆలోచనా సంకల్ప ప్రభావం ప్రబలంగా ఉన్న మనస్తత్వరంగంలో మరీ ఎక్కువ సాధించగలగాలి. మన ఊహకందిన అత్యున్నతాదర్శానికి అనుగుణంగా సృజింపబడిన విలక్షణాకృతిని ఏకాగ్రతతో, సంకల్పబలంతో మనము జీవలోకంలోకి తీసుకురాగలము. వాస్తవస్థితి ఈ విధంగావుంటే వ్యక్తుల గుణాలు వంశ పారంపర్యంగానూ, వంశంలోని ప్రాచీనులనుండీ సంక్రమించ వచ్చుననే తెలిసీ తెలియని ధోరణులను అంగీకరించడం ఎందుకు? ఇవి కేవలం మన శీల ధోరణుల వైపునకే మనకు తెలియకుండా ప్రసరించే తీరులు తప్ప మరేమీ కావు. పైన చెప్పిన ఉద్యమంతో మాతృత్వము నిజమైన విలువ. పవిత్రత

కలిగినదవుతుంది; అంతేకాదు, మనమప్పుడు ఉత్కృష్టమైన పారమార్థిక క్రియారంగంలోకి ప్రవేశించిన వారమవుతాము. అప్పుడు స్త్రీత్వం జంతుత్వాన్నీ, దాని సాధారణ ప్రవృత్తులనూ దాటి నిజమైన మనుష్యత్వం వైపుకీ, దాని ప్రాభవం వైపుకీ ఆరోహణం ప్రారంభిస్తుంది.

అంటే, ఈ ఉద్యమంలోనే, ఈ యత్నంలోనే మన యదార్థ కర్తవ్యం వుంది. ఎల్ల కాలాలలోనూ ఈ కర్తవ్యానికి చాలా గొప్ప ప్రాముఖ్యం ఉన్నదనుకుంటే ఇప్పటి పృథ్వీ పరిణామ సరణిలో దానికి ఎప్పుడూ లేనంత ప్రాముఖ్యం వున్నది.

ఎందుచేతనంటే, ప్రపంచచరిత్రలో ఒక విశిష్టసమయంలో ఎన్నడూ ఎరుగని వేరొక బాటలోకి అడుగు పెట్టవలసినచోట మనము నివసిస్తున్నాము. ద్వేషమూ, రక్తపాతమూ, సంభ్రమమూ నిండివున్న ఇప్పటి అంధకారమయ దశవంటి దానిలో, బహుశః ఇంతకు పూర్వము మనుష్యజాతి ఎన్నడూ పయనించలేదు. అదేవిధంగా ఇప్పటి మనుష్యుల హృదయాలలో మొగ్గ తొడుగుతున్న ఆశ ఇంతబలిష్ఠంగా, ఇంత అంతఃపటిమతో పూర్వమెన్నడూ లేదు. నిజంగా మన హృదయవాణిని మనము వినగలిగితే, ఎంతోకొంత, తెలిసిగానీ, తెలియకగానీ న్యాయమూ, సౌష్ఠవమూ, సామరస్యంతో కూడిన సౌహృదయమూ, భ్రాతృభావమూ మళ్ళీ సింహాసనం అధిష్ఠించడం ఎప్పుడా అని మనము ప్రతీక్షిస్తూ వున్నట్లు సత్వరంగా గమనించగలము. అయితే ఇది ప్రపంచ వాస్తవస్థితికి పూర్తిగా విరుద్ధంగా వున్నట్లు కనిపిస్తుంది. కాని ఉషఃకాలానికి ముందు వున్నంత చీకటి నిశీధినిలో ఎప్పుడూ ఉండదని మన కందరకూ తెలుసు. ఆదే నిజమైతే ఇప్పటి ఈ చీకటి ఆసన్న మవుతున్న ఉషఃకాలానికి చిహ్నం కాకూడదా? ఎప్పుడూ లేనంత సమగ్రంగా, భీకరంగా

ఈ నిశీథిని వున్నట్లే, రానున్న ఉషఃకాలంకూడా ఎప్పుడూ లేనంత భాసురంగా, స్వచ్ఛంగా, ఉద్దీపకంగా వుండవచ్చు. దుస్స్వప్నాలతో నిండిన ఈ రాత్రి గడచిన తరువాత ప్రపంచమొక నూతన చైతన్యాన్ని దర్శించవచ్చు.

ఇంత అద్భుతావహంగా అంతమొందుతున్న ఇప్పటి నాగరికత మనశ్శక్తి మీద ఆధారపడివుంది. ఈ మనస్సు జడపదార్థంతోనూ, జీవితంతోనూ ముడిపడివున్నది. అది ప్రపంచానికి ఎట్టిదిగావుందో మనము చర్చించనక్కర లేదు. కాని ఇప్పుడు కొత్తగా ఒక పారమార్థిక పరిపాలనం వస్తున్నది: అంటే మనుష్యపాలనం తరువాత దైవపరిపాలనం.

ఇంతటి అపూర్వమైన. మహత్తరమైన సమయంలో భూమిమీద జీవించి వుండే అదృష్టంపట్టిన జనులు తమ వ్యక్తి పరిమితులనూ, కుటుంబపు హద్దులనూ దాటకుండగా వుండడం, తమ స్వంత లాభములనూ, పరిసర బంధాలను మించిన ఆలోచనలు లేకుండగా పోవడం సమంజసంగా వున్నదా! తమకూ, తమ కుటుంబాలకూ, తమ దేశాలకూ చెందినవారు కాకుండగా సకలదేశాలలో సమస్త మానవజాతిరూపంలో ఆవిష్కరించివున్న భగవంతునికి మాత్రమే చెందినవారుగా ఉన్నవారందరూ మనుష్యజాతికోసం. ప్రభాత సమయస్ఫూర్తికోసం తాము లేచి బద్ధకంకణులై పనిచేయాలని గమనించినవారే.

ఇంత ప్రముఖమైన, అనంతమైన బహుముఖమైన పనిలో స్త్రీజాతి ఏ పాత్ర వహించవలసివుంది? గొప్ప సంఘటనలుగాని, గురుతర కార్యభారముగాని మీదపడినప్పుడు స్త్రీలను పెత్తనంతో నిండిన చులకన నవ్వుతో ఒక మూలకు నెట్టివేయడం ఆచారంగా వస్తున్నమాట నిజమే. అంటే ఏమని

అర్థం? "ఇది మీ పనికాదు; మీరు దయనీయులు; అబలలు; వ్యర్థప్రాణులు" అని. దీనికి తగినట్లు చాల దేశములలోని స్త్రీలుకూడా లొంగిపోయి, పిల్లల వలె, బహుశః సోమరితనంచేతకూడా ఇటువంటి గర్హ్య పరిస్థితులను అంగీకరించారు. వారు చేసినది తప్పు అని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను. రానున్న మానవ జీవితంలో స్త్రీ పురుషుల నడుమ అటువంటి విభేదానికీ, ఎక్కువతక్కువలకూ ఏ మాత్రం స్థానం ఉండకూడదు. సమానస్థాయిలో పరస్పర సహాయసహకారాలు చేసుకోవడమే స్త్రీ పురుషుల నడుమవున్న సముచిత సంబంధము. ఇప్పటినుండి మనము ఆధ్యాత్మిక సంస్కరణంలో విద్యాబోధనంలో మనకున్న యదార్థపదవినీ, అర్హస్థానాన్నీ తిరిగిచేపట్టి మనకు నిజంగా వున్న ప్రాముఖ్యాన్ని ఉద్ఘాటించవలసివుంది. వాస్తవంగా, కొందరు పురుషులు, బహుశః కొద్దిమంది మాత్రమే, తమకున్నట్లుగా ఊహించుకొనే లాభోత్కర్షాలచేత ఉబ్బిపోయి స్త్రీలలో పై చూపులకు మాత్రమే కనిపించే బలహీనతను ఏవగించుకోవచ్చు. (స్త్రీలలో కనిపించే ఈ బాహ్య బలహీనతను గురించికూడా అంత నిశ్చయంగా చెప్పడానికి వీలులేదు). కాని మనం ఏమి చేసినప్పటికి అతిమానుషవ్యక్తిని ప్రసవించవలసిన వారు స్త్రీలు మాత్రమేకదా!" అని ఒకరు చాలాచక్కగా చమత్కరించారు.

అతి మానుషవ్యక్తిని కనవలసినవారు స్త్రీలే, ఇది పూర్వపక్షరహితమైన సత్యము. కాని ఈ సత్యాన్ని గురించి గర్వించినంత మాత్రాన సరిపోదు. పై వాక్యాన్ని మనం స్పష్టంగా అర్థంచేసుకోవాలి. అది మనమీద మోపే భారాన్ని తెలుసుకోవాలి. అది మనముందు పెట్టే క్లిష్ట కర్తవ్యాన్ని చిత్తశుద్ధితో నిర్వర్తించడం నేర్చుకోవాలి. ప్రపంచ వ్యాప్తంగావున్న ఇప్పటి పనిలో సరిగా ఈ క్లిష్ట కర్తవ్యమే మన ముఖ్యభాగంగా స్వీకరించాలి.

ఈ పని చేయాలంటే ఇప్పటి అస్తవ్యస్తస్థితినీ, అంధకార బంధురత్వాన్నీ దీప్తిలోనికీ, సామరస్యంలోకీ పరివర్తించే సాధనసామగ్రి ఏమిటో కనీసం దాని బాహ్యరూపమైనా, మనం అర్థంచేసుకోవటం ముఖ్యం.

ఈ పనిచేయడానికి రాజకీయ, సాంఘిక, నైతిక మతపరములైన మార్గాలు చాలా సూచింపబడినయి. నిజానకి ఈ క్లిష్టకర్తవ్య భారాతిశయాన్ని ఎదుర్కొని తగినంత కృతకృత్యత సాధించడానికి పైవాటిలో ఏ ఒక్కటీ సమర్థంగా వున్నట్లు కన్పించదు. మనుష్యునిలో ఒక కొత్త చైతన్యాన్ని సృజించే ఒక నూతనాధ్యాత్మిక స్రోతస్విని మాత్రమే ఈపనిలో నిమగ్నులైనవారికి అడ్డుకల్పించే బహుళ విఘ్నరాశిని దాటించగలదు. ఇది ఒక నూతనాధ్యాత్మిక జ్యోతి; ఇంతవరకు భూమిపైన ఎరుగని దైవసాక్షాత్కారము; భూమిమీద మనకు అపూర్వమైన ఒక దైవభావము; ఒక నవ్య దివ్య రూపము,

ఇక్కడనుంచి మనము బయలుదేరిన చోటికి తిరిగివద్దాము. అది ఏమంటే యదార్థమైన మాతృత్వంయొక్క కర్తవ్యము, ఎందుచేతనంటే, ప్రస్తుత పృధ్వీస్థితిని పరివర్తించే ఆధ్యాత్మికశక్తిని ఆవిష్కరించ గలిగే రూపాన్ని, ఈ కొత్తరూపాన్ని స్త్రీలు కాకపోతే ఎవరయ్యా నిర్మించేది?

ప్రపంచ జీవితంలోవున్న ఇప్పటి క్లిష్టదశలో వ్యక్తిగతంగా మనకున్న అత్యున్నతాదర్శాన్ని వెలువరించే జీవిని ప్రసవించడంచేత మాత్రమే సరిపోదని పైనచెప్పిన దానివలన తెలుస్తున్నది. రానున్న మనుష్యుల తీరు ఎటువంటిదో, ఎటువంటివారి ఆగమనంకోసం ప్రకృతి బాటలునిర్మిస్తూవుందో కనుగొనవలసిన భారం మనది, ఇంతకుపూర్వం వినీ, కనీవున్న మహాపురు

షల వంటి వారినిగాని అంతకంటె ఎక్కువ వ్యుత్పన్నత, సహజ ప్రజ్ఞ వున్నవారినిగాని రూపొందించినంత మాత్రంచేత సరిపోదు. మానవజాతి పరిణామాలనూ, లక్షణాలనూ అతిక్రమించి అతిమానుషవ్యక్తిని ఆవిర్భవింప జేసే ఉత్కృష్టమైన అవకాశం ఒకటివుంది. మన ఆలోచనా సంకల్పముల నిరంతరాకాంక్షతో ఆ అవకాశ సాంగత్యాన్ని మానసికంగా పొందే తీవ్ర ప్రయత్నం చేయాలి.

ఎవ్వరూ అనుకోనిదీ, అందరికీ కొత్తదీ అయిన సృష్టిచేయాలనే ప్రేరణ ప్రకృతిహృదయంలో మళ్ళీ మిలమిలలాడుతూవుంది. ఈ ప్రేరణకే మనం విధేయులంగా వుండి కార్యరూప సమాధానం చెప్పవలసివుంది.

ఈ ప్రకృతి ప్రేరణ మనలను ఎక్కడకు తీసుకుపోతుందో తెలుసు కోవ డానికి ప్రయత్నం చేద్దాము. గతకాలం మనకు నేర్పిన పాఠాలవైపు దృష్టి సారిస్తే ఈ ప్రయత్నానికి అది చక్కని మార్గం చూపిస్తుంది. ప్రకృతి ఎప్పుడు ఒక ముందడుగువేసినా, భూమిమీద ఒక కొత్త కార్యసాధక శక్తితో కూడిన మూలతత్వము ఎప్పుడు ఆవిర్భవించినా, అప్పుడే ఒక కొత్తప్రాణి సమాజంకూడా రావడం మనము చూస్తూనే వున్నాము. అదేవిధంగా మనుష్య జాతికి మార్గదర్శిత్వం వహించే వారి కృషివలన ముందుకు నడిచే సమాజ జీవితాలూ, జాతిజీవితాలూ, వ్యక్తిజీవితాలూ నిరంతరంగా కొత్తదనమూ, సారమూ, ఆవేశమూ నింపుకొని మానవావర్తాలలో ఒకదానివెంట ఒకటి వస్తూవున్నాయి. ఈ జీవిత రూపాలన్నీ ఒకే గమ్యస్థానంవైపుకి, అనిర్వాచ నీయమై, గుప్తమై మహోజ్జ్వలంగా వున్న ప్రకృతి గమ్యస్థానం వైపుకి నడుస్తూవున్నాయి.

ఈ విధంగా పిలుస్తూవున్న ప్రకృతికి మనం సమాధానం చెప్పాలి. ఇంత మహోదారమైన, వైభవోపేతమైన ఈ పనికే మనలను అంకితం చేసుకోవాలి. ఇదివరకెవ్వరూ నడవని ఇంత కష్టమైన బాటమీద ముందరికి పోయేటప్పుడు ప్రతి అడుగూ ఎట్లా వెయ్యాలో స్పష్టంగా తెలుసుకొనేటందుకు ప్రయత్నం చేద్దాము.

ప్రధమంగా భావిమానవుణ్ణి లేదా అతి మానుష వ్యక్తిని అంతర్నిహితం చేసే ప్రయత్నంలో జాగరూకతతో వుండాలి. అంటే ఇప్పుడువున్న మనిషినే సమగ్రంగా చేస్తేనో, శక్తిసంపన్నతలతో నిండివుండేటట్లు చేస్తేనో ఇది సమకూడుతుందనుకోకూడదు. వీలైనంతవరకూ ఈ పొరపాటు చేయకుండా వుండాలంటే జీవితంలో వచ్చిన పరిణామ పరంపర మనకేమి బోధిస్తుందో శ్రద్ధగా చూడాలి.

ఒక కొత్త ప్రాణిసమాజం ఎప్పుడు ఆవిర్భవించినా అది ఒక నవ్యమూల తత్వమూ ఒక నూతన చైతన్యస్థితీ, ఒక కొత్త ప్రాబల్యమూ లేదా శక్తి భూమి మీద సాక్షాత్కరిస్తున్నట్లు ఉద్ఘోషిస్తుందని ఇంతకుముందే గమనించాము. కాని ఒకవైపున ఈనూతన ప్రాణిసమాజం అపూర్వమైన శక్తినీ లేదా చైతన్యాన్నీ పొందితే మరొకవైపున తనకు పూర్వం వున్న ప్రాణిసమాజపు విశిష్ట సంపిద్ధులలో కొన్నింటిని పోగొట్టుకోవచ్చు. ఉదాహరణకి; ప్రకృతి అభివృద్ధిలో చిట్టచివరిదశను చూడండి. నరునికీ అంతకు ముందువున్న వానరునికీ నడుమ వున్న గొప్ప భేదాలేవి? వానరునిలో జీవశక్తి భౌతికసామర్ధ్యము పరాకాష్ఠకు చేరినయి. తరువాత వచ్చిన మానవుడు వీటిని పరిత్యజించవలసి వచ్చింది. అద్భుతావహంగా చెట్లెక్కడమూ, అగాధముల మీదనుంచి పిల్లిమొగ్గలు వేయడమూ, శిఖరంనుంచి శిఖరానికి లంఘించడమూ మనిషికి వశం తప్పిపోయి

నయి. కాని వీటికి బదులుగా అతనికి ధీశక్తి, హేతుబలం, సమ్మేళన కౌశలం, నిర్మాణనైపుణ్యం మొదలైనవి అలవడినయి. వాస్తవంగా మనుష్యునితోనే మానసిక జీవితమూ, బుద్ధిశక్తికల జీవితమూ భూమిమీదకు వచ్చినయి.

మనిషి అంటే ముఖ్యంగా మానసికజీవి. అతనిలోవున్న భవ్యశక్తులు మనస్సుదగ్గరే ఆగకపోతే, అతడు మానసిక జీవితాన్ని అతిక్రమించి తనలో లోకాంతరాలు, ఇతర ప్రజ్ఞలూ, అన్యచైతన్య వ్యవస్థలూ వున్నట్లు భావిస్తే అవి,— సరిగా వానరములో నిగూఢ మనశ్శక్తుల వలెనే— భవిష్యత్సిద్ధి సూచకములుగా మాత్రమే వున్నయి.

మనము ఆధ్యాత్మిక ప్రపంచమని చెప్పేదానిలో కొద్దిమంది, చాలా కొద్దిమంది నివసించినమాట వాస్తవమే. మరికొందరు ఆ ప్రపంచానికి సజీవ రూపాలవలె భూమిమీద వున్నారు. కాని వారు అత్యంతమూ అసాధారణులు. వారు ఆధ్యాత్మిక ప్రపంచాభిముఖంగా వున్న మానవ సమూహానికి, సాధారణ మానవునకుకాదు,- ముందు నడచి భవిష్యత్సిద్ధికి దారిచూపేవారు. కాని ఒకప్పుడు దేశకాలములలో చెల్లాచెదురుగావున్న కొద్దిమందికిమాత్రమే స్వంతం వున్నట్టిది రానున్న సమాజానికంతటికీ ప్రముఖలక్షణంగా పరిణమించాలి.

ప్రస్తుతము మనుష్యుడు తన జీవితాన్ని హేతుబద్ధంగా నడుపుకొంటున్నాడు. మనఃప్రవృత్తులన్నీ అతనికి సాధారణంగా వుపయోగపడుతున్నయి. పరిశీలనమూ, అనుమతీ అతనికి జ్ఞానోపార్జన సాధనాలు. జీవితంలో హేతువుననుసరించి అతడొక నిర్ణయం చేసుకొని దారి చూసుకొంటాడు. లేదా ఆ విధంగా చేస్తున్నట్లు విశ్వసిస్తాడు.

రానున్న కొత్తసమాజం తన జీవితాన్ని అంతఃస్ఫురణబద్ధంగా నడుపుకొంటుంది. అంతఃస్ఫురణమంటే మనలోవున్న దివ్యధర్మాన్ని సూటిగా

చూడడం అని చెప్పుకోవచ్చు. అరణ్యాలలోవున్న కొన్ని పెద్ద గొరిల్లాలు అప్పుడప్పుడు హేతువు పొలిమేరలకు వచ్చినట్లే కొందరు మనుష్యులు ఈ అంతఃస్ఫురణాన్ని వాస్తవంగా తెలుసుకొని అనుభవంలోకి తెచ్చుకొన్న వాళ్లున్నారు.

మనుష్యజాతిలో అంతరాత్మకై కృషిచేసి తమ నిజమైన ఆంతరంగిక ధర్మాన్ని కనుగొనడం మీదనే తమ శక్తులనన్నింటినీ కేంద్రీకరించిన కొద్ది మంది ఈ అంతఃస్ఫురణజ్ఞత ఎంతోకొంత కలిగివున్నవాళ్ళే.

మాలిన్యాన్ని పూర్తిగా తుడిచివేసిన అద్దంవలె, మంద పవనమైనా లేని రోజున నిశ్చలంగావున్న మడుగువలె మనస్సు పరిపూర్ణ ప్రశాంతితో వున్నప్పుడు ఋతచేతనముయొక్క కాంతి, అంతః సత్యముయొక్క దీప్తి ఈనిశ్చల మనస్సుపై ప్రకాశించి అంతఃస్ఫురణాన్ని ఉద్భవింపజేస్తుంది నిశ్శబ్దము నుండి ఈ వాక్కును వినడానికి అలవాటు పడినవాళ్లు దీనినే తమ నడవడి వెనుకవుండి నడిపించే శక్తిగా స్వీకరిస్తారు. సాధారణ మానవులు పెక్కు చిక్కులుపడివున్న హేతుమార్గాలలో పరిభ్రమిస్తూవుంటే వీరు జీవితపు మలుపుదారులలో ఉన్నత చిత్తవృత్తిచే నడుపబడి, బలిష్ఠమై, గమ్యాభిముఖమైన హస్తమొకటి వారిని నడిపిస్తూవున్నట్లు సూటిగా తమదారివెంట వెడతారు.

ఇటువంటి ప్రజ్ఞ ఇప్పటికి చాలా అపురూపంగా వుంది — అసహజంగా వుందనికూడా చెప్పవచ్చు. కాని ఇది రేపటి మానవునికీ, క్రొత్త సమాజానికీ తప్పనిసరిగా సర్వసాధారణంగానూ ప్రకృతి సిద్ధంగానూ వుంటుంది. కాని నిరంతరంగా దీనినే వుపయోగించడంవలన హేతుశక్తులు క్షీణించిపోవచ్చు. వానరానికివున్న అత్యంత భౌతికసామర్థ్యం ఇప్పటి మనుష్యునికి లేనట్లుగానే

రేపటి అతి మానుషవ్యక్తి ఇప్పటి మనుష్యుని అత్యంత మానసిక సామర్థ్యం కోలుపోవచ్చు. మానసిక సామర్థ్యం అంటే తన్నుతాను వంచించుకొని ఇతరులను వంచించే సామర్థ్యం.

మానవుడు తానింతవరకూ అభివృద్ధి చేసుకొన్నదంతా, సముచితంగానే అయినా రిక్తంగా గర్వపడే తన బుద్ధిశక్తితో కలిపి, తనకు చాలదని ధైర్యంగా వక్కాణించగలిగిననాడు అతిమానుష వ్యక్తిత్వంపైపుగా వున్న మానవుని బాట ప్రయాణానికి అనుకూలమవుతుంది. అంతరంగంలోవున్న ఇంతటి మహత్తర శక్తిని ఆవరణంలోనుండి వెలికితీసి, దర్శించి, విస్తరిల్లజేయడమే ఇప్పటినుండి మానవుని అంగీకృత ప్రవృత్తికావాలి. అప్పుడు అతని వేదాంతము, కళ, శాస్త్రము, నీతి, సంఘస్థితి, వలయాకారంలో తిరుగుతున్న జీవిత మనశ్చర్యలుగావున్న జీవిత ప్రవృత్తులు ఆ జీవిత మానసములకు వెనుకగా వున్న మహత్తర సత్యాన్ని కనుగొని దాని శక్తిని మానవ జీవితంలోకి తీసుకువస్తాయి. మనలో అత్యున్నతంగా, యదార్థంగావున్న ఆత్మను, స్వభావాన్ని దీనిమూలంగా కనుగొన్నట్లవుతుంది.

ఈ ఆత్మరూపములోకి మనం పరిణామం చెందాలి. ఇప్పటి వరకు ఆ ఆత్మరూపంలో మనములేము. ఇది 'నీషే' చేత స్తోత్రపాఠాలు చేయబడ్డ బలవత్తర జీవసంకల్పం కాదు. ఇది ఆధ్యాత్మికమైన అంతర్వ్యక్తి, ఆధ్యాత్మికమైన స్వభావంమాత్రమే. మనము అతిమానుషవ్యక్తిత్వాన్ని గురించి మాటాడేటప్పుడు దానిని గురించి 'నీషే'కు వున్న సారహీనమైన అసంపూర్ణ భావం చేత, అవి ఎంత బలంగా వున్నప్పటికీ, భ్రాంతిపడకుండా వుండేటట్లు జాగ్రత్తపడాలి. 'అతిమానుషవ్యక్తి' అనే మాటను మొట్టమొదట వుపయోగించినవాడు 'నీషే'. కనుక ఎవరైనా రానున్న సమాజాన్నిగురించి మాటాడితే, ఇష్టం

వున్నా లేకపోయినా అందులోకి 'నీషే' భావమే వస్తుంది. ప్రస్తుతం చాలా అసంతృప్తికరంగా వున్న మనుష్యత్వంలో నుంచి అతిమానుష వ్యక్తిని పెంపొందింపజేయాలనే ఊహ నిస్సందేహముగా చాలామంచిఊహ. మనలను మన సత్యస్వరూపంలోకి పరిణమింపజేయడమే మన గమ్యము అన్న అతని సూత్రము నిజముగా సర్వోత్కృష్టమైనది. ఈ సూత్రంలో విజయవంతంగా, ప్రయత్ననిరపేక్షంగా జీవించడానికి అవసరమైన తన నిజమైన ఆత్మను, నిజమైన స్వభావాన్ని ఇప్పటివరకూ మానవుడు చూడలేకపోయాడన్న విషయం గర్భితంగావుంది. అయినప్పటికీ 'నీషే' చేసిన ఒక తప్పును మనం పరిహరించాలి. అతని అభిప్రాయం ప్రకారం అతిమానుషవ్యక్తి అంటే పదవీ బల వైభవాలతో కూడిన వాడనీ, అత్యున్నతుడనీ, అపారమైన ఆధికారశక్తి కలవాడనీ, వీటికంటె భిన్నమైన మానవలక్షణాలను అణగద్రొక్కి రూపు మాపేవాడనీ ఎంచవలసి వుంది. అది మన ఆదర్శం కావడానికి వీలులేదు. కేవలశక్తినే ఆరాధించడంవల్ల బలవంతులు పాపకృత్యాలవైపుకే మొగ్గుతారనీ, ఖండ ఖండాంతరాలన్నీ నాశనానికి గురి అవుతాయనీ ఇప్పటికే మనకు బాగా తెలుసు.

★ ★ ★

అనుల్లంఘనీయమైన పరమానందమును నేనే;
నన్నెవరు అనుసరింతురో వారలెన్నటికిని దుఃఖములకు లోనుగారు.

— శ్రీఅరవిందులు

# స్త్రీ సమస్య

స్త్రీ జన సమస్యను గురించి మీకు చెప్పాలి అని అనుకున్నాను. ఈ సమస్య పైచూపుకి మనుష్య జాతితోనే పుట్టినట్లు కనిపిస్తుంది, కాని దాని మూలంలో అది అంతకంటె ఎంతో పూర్వమైనది. దీనిని నియమించే ధర్మమేమిటి అనిగాని, దీనికి పరిష్కారమేమిటీ అనిగాని కనుగొనవలెనంటె మనం విశ్వం పుట్టినచోటికి, అమాటకువస్తే సృష్టికే ఆవలకు పోవలసి ఉంటుంది.

అతి ప్రాచీనమైన కొన్ని సంప్రదాయాలు, బహుశః ప్రాచీనతమములైన సంప్రదాయాలు దృశ్యరూపంలో ఆత్మావిష్కారం చేయనెంచిన పరాత్పర సంకల్పము విశ్వసృష్టికి కారణమనీ ఈ పరరూపావిష్కారంలో సృజనాత్మక సంప్రదాయాలు పరాత్పరమైన దానిని పురుషరూపంగానూ, సృజనాత్మక చైతన్యాన్ని స్త్రీ రూపంగానూ చెప్పడానికి అలవాటు పడినయి. ఈ విధంగా చెయ్యడం వలన సృష్టి ప్రధమరూపం స్త్రీ పురుష భేదానికి తావలమై, ఒక్క దెబ్బతో పురుషత్వానికి స్త్రీత్వంపైన ఒక రకపు ప్రాముఖ్యాన్ని ఇచ్చినట్లయినది. వాస్తవంగా వారిద్దరూ ఒక్కరే అయినా పరస్పరం అభిన్నరూపాలే అయినా ఆవిష్కారానికిముందు ఏకరూపులై ఉన్నప్పటికీ పురుషరూపమే మొదట నిశ్చయించి, ఆ నిశ్చయించిన రూపాన్ని కొనసాగించడానికి స్త్రీ

రూపాన్ని ఆవిర్భవింపజేసింది. అంటే ఏమని అర్థం: స్త్రీ రూపంలేకుండా సృష్టి అనేది లేకపోతే పురుషరూపంయొక్క ప్రథమ నిశ్చయం లేకపోతే స్త్రీరూపమైన ఆవిష్కారంకూడా లేదు— అని.

ఈ వివరణము అంతా కొంచెం మనుష్య ధోరణికి సంబంధించినదిగా లేదా అని అడగడానికి తప్పకుండా వీలుంది. కాని నిజం చెప్పాలంటే మానవుడు ఇవ్వగలిగిన వివరణాలన్నీ కనీసం వాటి సూత్రీకరణంలో తప్పనిసరిగా మనుష్యధోరణిలోనే ఉండాలి. అసాధారణమైన వ్యక్తులు కొందరు అచింత్యమూ, అజ్ఞేయమూ అయిన దైవము వైపుకి ఆధ్యాత్మికారోహణం చేస్తూ మానవ స్వభావాన్ని దాటిపోయి తాము అన్వేషించిన దానితో తాదాత్మ్యాన్ని పొందించే అనిర్వచనీయమైన, వాచామగోచర విస్ఫారమైన అనుభవాన్ని సంపాదించారు. కాని వారు కనుగొన్న దానిచే ఇతరులనుకూడా ఆ లబ్ధిని పొందేటట్లు చేయడానికి పూనుకున్న వెనువెంటనే వారు తమ అనుభవాన్ని సూత్రీకరించవలసి వచ్చింది. ఈ సూత్రం అర్థం అయ్యేటట్లు ఉండాలంటే అది మనుష్య ధోరణిలో, సంకేతాత్మకముగా ఉండితీరాలి.

ఈ అనుభవాలనూ, దానివలన సాక్షాత్కరించే వాటినీ సంపాదించడం వలన పురుషుడు స్త్రీ కంటె ఎక్కువతనంతో ఉండడం సంభవించిందా! లేక దీనికి భిన్నంగా, మిక్కిలి విస్తరించిఉన్న ఈ పురుషుని ఎక్కువతనంవల్ల ఆ అనుభవానికి అటువంటి సూత్రీకరణ చెయ్యడం జరిగిందా అని అడగడానికి వీలుంది.

ఏదైతే ఏమి, నిస్సందిగ్ధమైన వాస్తవ విషయం మన ఎదుట ఉంది. పురుషుడు ఎక్కువ వాడైనట్లు భావించి ఆధిపత్యం చూపించాలనుకొంటాడు.

స్త్రీ పీడింపబడుతున్నట్లు భావించి బహిరంగంగానో అంతరంగంలోనో ఎదురు తిరుగుతుంది. ఈ విధంగా ప్రతియుగంలోను అంతస్తత్త్వంలో ఒక్కటే అయినా, పైకి కనిపించే ధోరణులలోను, తీరులలోను, అసంఖ్యాక విధము లుగా కనిపిస్తూ స్త్రీ పురుషుల నడుమ శాశ్వత కలహం కొనసాగుతూనేఉంది.

పురుషుడు స్త్రీ మీదను స్త్రీ పురుషుని మీదను నిందనంతటినీ ఆరోపిస్తారని అందరికీ బాగా తెలిసిన విషయమే. నిజానికి యీ నింద ఇద్దరకూ సమంగా పంచిపెట్టాలి. వీరిలో ఒకరు ఇంకొకరికంటె అధికులమైనట్లు డంబాలు చెప్పు కొనడం పనికిరాదు. అంతేకాకుండా యీ ఎక్కువ తక్కువతనాలను గురించిన ఊహయే తొలగింపబడే వరకూ యీ సమస్యను పరిష్కరించడంగానీ మానవ జాతిని అన్యోన్య ప్రతికూలంగా ఉండే రెండు శిబిరాలలోకి విడదీసిన అపా ర్థాన్ని రూపుమాపడంగానీ ఎవరికీ శక్యంకాదు; ఏవిధంగానూ కుదరదు.

ఈ సమస్యను గురించి అనేక ప్రసంగాలూ, రచనలూ లెక్కలేనన్ని వున్నవి. ఎన్నిరకాల చూపులతో దీనిని పరిశీలించారన్న విషయం అన్నివైపు లనుండి వివరించాలంటే ఒక ఉద్గ్రంథం వ్రాసినా సరిపోదు. మామూలుగా చెప్పుకుంటే అన్నిరకాల వాదాలు చాలామంచివే; ఒక్కొక్క దానిలో ఒక్కొక్క సుగుణం వుందని అందరూ ఒప్పుకొంటారు. కాని వీటి ఆచ రణమే అంతబాగావున్నట్లు నిరూపించుకోలేక పోయింది. ఈ విషయాలలో మనము ఎంతవరకు సాధించాము అంటే రాతియుగం వాళ్ళని దాటివచ్చామో లేదో నాకు తెలియదు. ఎందుచేతనంటే వారి పరస్పర సంబంధాలలో స్త్రీ పురుషులు ఒకరి విషయంలో ఒకరు సంపూర్ణ నియంతృత్వాధి పత్యమూ, ఇంకొకవైపున దయనీయమైన దాస్యమూ అనుభవించే వాళ్లుగా ఉన్నారు.

"దాసులు" అన్న మాటయే నిజము. ఎందుచేతనంటే నీకు కోరికలూ, అభిరుచులూ, ఆసక్తులూ ఉన్నంతకాలం వాటికీ, వాటిని నెరవేర్చుకోవడం కోసం ఎవరిమీద ఆధారపడి ఉంటావో వారికి నీవు దాసుడవే.

ఈ విధంగా పురుషునిమీద, అతని బలముమీద ఉన్న ఆకర్షణచేతనూ ఒక యిల్లూ దానిమూలంగా వచ్చే భద్రత వీటిమీద కోరికచేతనూ, మాతృత్వం మీద ఆసక్తివలనకూడా స్త్రీ పురుషునికి దాస్యం చేస్తున్నది. అదే విధంగా పురుషుడుకూడా ఇది తనది అన్న భావంచేతనూ, అధికారంమీద, ఆధిపత్యం మీదవుండే తీవ్రవాంఛ చేతనూ, మిధున భావాభిలాషచేతనూ, అల్ప సౌఖ్య సౌకర్యాల చేతనూ దాస్యం చేస్తున్నాడు.

అందుచేతనే స్త్రీల విమోచనం ఏ చట్టం వల్లనూ కుదరదు. అదే విధంగా పురుషులుకూడా వారికి ఎంత ఆధిపత్యం ఉన్నప్పటికీ, తమ ఆంతరంగిక దాస్యంనుండి విడివడితేనే తప్ప దాసులుగా ఉండకతప్పదు. ఈ విధమైన రహస్య సంఘర్షణ, ఎవరిమటుకు వారు ఒప్పుకోరుగాని, తెలియకుండగానే ఎల్లప్పుడూ లోపలవుంటుంది. మిక్కిలి ఉత్తములైనవారి విషయంలోకూడా ఇది వర్తిస్తుంది. మానవులు సమగ్రచైతన్యంతో ఏకీభావాన్ని పొందడానికి ఉత్కృష్టమైన సత్యముతో ఏకరూపం పొందడానికి, సామాన్య చైతన్యము లోనుండి ఊర్ధ్వంగా పోయేవరకూ ఇది తప్పదేమో అనిపిస్తుంది. ఈఉన్నత చైతన్యాన్ని చేరుకొన్నప్పుడు స్త్రీ పురుషుల నడుమవుండే భేదం కేవలము భౌతికమైనది మాత్రమే అని స్పష్టమౌతుంది.

వాస్తవంగా భూమిమీద మొట్టమొదట విశుద్ధ పురుషత్వమూ, విశుద్ధ స్త్రీత్వమూ దేనికి దానికి స్పష్టంగా విభజింపబడిన విశిష్టగుణగణాలతో ఉండి

యుండవచ్చు. కాని కాలక్రమంలో తప్పనిసరిగా వచ్చిన సంమిశ్రణము, ఔరసత్వము, తల్లినిపోలిన కొడుకులు, తండ్రిని పోలిన కూతుళ్లు, సాంఘిక ప్రగతి, ఏకకార్య ప్రవృత్తి ఇవి అన్నీకలిసి ఎటువంటి విశుద్ధరూపాన్ని అయినా ఈ రోజులలో కనుగొనడం దుర్ఘటం చేసివేసినయి. ముఖ్యంగా ఈనాటి సమాజాలలో పురుషులందరికి అనేక విషయాలలో స్త్రీ లక్షణాలూ స్త్రీలకందరికీ చాలా విషయాలలో పురుషలక్షణాలూ వుంటున్నవి. దురదృష్ట వశాన ఈ భౌతిక రూపంవల్ల మాత్రమే పోరాడుకునే స్వభావం ఉంటూనే వుంది. ఒకరితో ఒకరు పోటీపడడం వలన బహుశః ఇది యింకా తీవ్ర రూపంలోకి పోతున్నదేమో.

చక్కని వేళలలో స్త్రీ పురుషులిద్దరూ తమ నడుమ భేదాన్ని మరచి పోగలరు. కాని అణుమాత్రం రెచ్చకొడితే ఇది వెంటనే తల ఎత్తుతుంది. స్త్రీ తన్ను స్త్రీ గానే భావించుకొంటుంది. పురుషుడు తాను పురుషుడనుగదా అనుకొంటాడు. తుది ఎక్కడో తెలియకుండా ఏదో ఒక రూపంలో పోరా టం మళ్ళీ మొదలవుతుంది. ఈ పోరాటం బాహాటంగానో, ప్రచ్ఛన్నంగానో కొనసాగుతూనే ఉంటుంది. ఇది పైకి చెప్పుకోనప్పుడు మరింత కసిగాకూడా వుంటుంది. స్త్రీ పురుషభావం లేని దేహాలలో తమ పరస్పరాభిన్న మూలాన్ని వ్యక్తంచేసే జీవాత్మలుగా వుండి స్త్రీ పురుషులనేవారు లేకుండగా పోయేరోజు వచ్చేవరకూ ఇది ఇట్లా వుండక ఎట్లావుంటుంది? అనికూడా అడగవచ్చు. ఒక్కటిగావున్న క్రియారూప చైతన్యంలో దర్శన సృజనాలనీ, భావాన్నీ, తద్భావరూపాన్నీ, తాదాత్మ్యం పొందిస్తూ మానవ సంభూతిలో సర్వసమ న్వయ సామరస్య శ్రేష్ఠరూపమైన వ్యక్తి నివసించడానికీ, భవ్యజీవితాన్ని గడపడానికీ, వీలు కల్పించే ప్రపంచంకోసం, పైన చెప్పిన వైరుధ్యాలవంటి వాని నామరూపాలైనా లేని ప్రపంచంకోసం మనము కలలు కంటున్నాము.

యదార్థంగా ఈ సమస్యకు ఇటువంటి హాయినిచ్చే సమూలమైన పరిష్కారం లభించేవరకు ఈ విషయంలోనే కాకుండగా ఇంకా అనేక విషయాలలో భీభత్సంగానూ, పరస్పర వినాశకంగానూ వుండే వైరుధ్యాలకు నిలయంగా భారతదేశం వుంటుంది. కాని ఈ వైరుధ్యాలన్నింటినీ సువిశాల సర్వసమన్విత సమరసైక రూపంలోనికి తీసుకుపోవడానికి వీలుంది.

సమస్త వరప్రదాయినిగా, సకల జగదంబికగా, నిఖిల దేవతాజననిగా, శత్రుసంహారిణిగా, విశ్వమాతగా పరాంబికాదేవిని అత్యంత సంపూర్ణ భక్తి భావముతో, నిరతిశయ నిర్భర పూజ్యభావముతో సేవించడం భారతదేశములోనేకదా మనము చూచేది!

దైవమునుండి దూరీకరించే భ్రంశకారిణిగా, మోహ పతన కారణమైన ప్రకృతిగా, అధోగతి దౌర్భాగ్యకారణమై దురితాత్మక సమ్మోహ రూపమైన మాయగా, ప్రకృతిగా, స్త్రీత్వ లక్షణాన్ని అత్యంత హేయభావముతో ఆమూలచూడముగా గర్హించడం భారతదేశములోనే కాదా మనము చూచేది?

భారతదేశములోని జీవితమంతా ఇటువంటి వైరుధ్యాలతో నిండిఉంది. వీటి మూలంగా ఆమె మనస్సులోనూ, హృదయంలోనూ వేదనపడుతున్నది. ఆ తల్లి రూపొందించిన అనేక పుణ్యస్థలాలలో స్త్రీరూప దేవవిగ్రహాలు ప్రతిష్ఠింపబడి ఉన్నవి. భారతమాత సంతానం తమ విమోచనాన్నీ,ముక్తినీ ఆత్మీయ ప్రియజననీ దుర్గాదేవియే ప్రసాదిస్తుందని ప్రతీక్షిస్తూ ఉన్నారు. "అవతారము" అనేది స్త్రీ రూపంలో ఎన్నడూరాదు అని ఒక భారతీయుడే అన్నాడంటే అది ఎంత విడ్డూరం! అట్లా అనకపోతే మేధావులైన హిందువు లెవ్వరూ ఆయనపేరు చెప్పుకోరు. మన అదృష్టం బాగుండి దైవానికి ఇంత సంకుచితమైన స్వశాఖాభిమానమూ లేదు; ఇటువంటి అల్ప విషయాలను

ఆయన పట్టించుకోనూ పట్టించుకొనడు. మనుష్యరూపంలో ఆవిష్కరించాలి. అనే ప్రీతితో ఆయన సంకల్పించినపుడు "నన్ను మనుష్యులు గుర్తిస్తారా, గుర్తించరా" అన్న విషయమే ఆయనకు పట్టదు. మీదు మిక్కిలిగా ఆయన అవతారము లన్నింటిలోనూ పండితులమీదకంటె సరళ హృదయుల మీదనూ చిన్నపిల్లల మీదనూ ఆయనకు ప్రేమఉన్నట్లు కనిపిస్తుంది.

అన్యోన్య పరిపూరకంగా ఉండే స్త్రీ పురుష భావాలలోకి విడిపోవలసిన బలాత్కారణం లేకుండగనూ, జంతు సంతానోత్పత్తి ధోరణి ఏమాత్రమూ అవసరం లేనట్లుగాసూ ఉండే నూతన మానవజాతిని సృష్టించడానికి ప్రకృతిని తప్పక ఒప్పించే ఒక ప్రత్యగ్ర చైతన్యమూ, ఒక నవీన భావనాస్రవంతి భూమిమీదకు అవతరించేవరకూ, ఇప్పటి మనుష్యజాతి స్త్రీ పురుషలిద్దరినీ సంపూర్ణ సమానత్వం కలవారినిగాచూచి, ఇద్దరికీ ఒకే విధమైన విద్యనునేర్పి ఒకే విధమైన శిక్షణ ఇచ్చి, స్త్రీ పురుష భావాతీతమైన దివ్యసత్యముతోడి నిరంతరసాంగత్యం మూలంగా అన్ని ప్రాప్తులకూ, అన్ని సామరస్యాలకు మూలమైనదానిని కనుగొనడానికి అనువుగా ఉండేటట్లు బోధచేయడమే ఇప్పటికి మనము చేయగలిగిన శ్రేష్ఠమైనపనిగా కనిపిస్తున్నది.

సర్వ వైరుధ్యనిలయమైన భారతదేశం, బహుంశాః నూతన యోగ్యసిద్ధి నిలయమైన క్షేత్రంగా పరిణమించగలదు. ఏతాదృశ సంభవ లీలలకు భారత భూమియే గదా ఉయ్యాలవంటిది.

* * *

# స్త్రీ దేహము

(ప్రశ్నోత్తరములు)

ఓరి దైవమా! నీవు బాలికవో బాలుడవో మరచి
పోయి ఒకమనిషివి కావడానికి ప్రయత్నం చేయలేవా?

ప్రతి ఊహ లేక ఊహావిన్యాసము తన దేశంలో
తన కాలంలో సత్యంగా ఉంటుంది. కాని అది తాను
మాత్రమే ఉండడానికి ప్రయత్నించినా, లేదా దాని
కాలం తీరిన తరువాతకూడా నిలిచి ఉండదలచు
కొన్నా అది సత్యరూపంలో ఉండలేదు.

ప్రశ్నలు :

వ్యాయామవిద్య పిల్లలకు నేర్పుతూ ఉన్నప్పుడు విద్యార్థినులకు సంబంధిం చిన కొన్ని సమస్యలను మేము ఎదుర్కొనవలసి వస్తున్నది. వీటితో చాలా వరకు వారి మిత్రులు. ఎలప్రాయంలో ఉన్న బాలికలు, తల్లిదండ్రులు,

వైద్యుడు కలిగించేవే. ఈ క్రింది ప్రశ్నలపై మీ సమాధానకాంతి పడితే మా బాధ్యతలను ఇప్పటికంటె ఎక్కువ సఫలంగా నిర్వహించడానికి తగిన బోధ మాకు అలవడుతుంది.

1. ఋతుమతిగా ఉన్నబాలిక ఏ చిత్తవృత్తితో ఉండాలి?

2. ఋతుమతిగా ఉన్నప్పుడు వ్యాయామవిద్యలోని ప్రతిదిన కార్యక్రమంలో పాల్గొనవచ్చునా?

3. ఋతుకాలంలో కొంతమంది బాలికలు వీపు దిగువభాగంలోనూ. పొత్తి కడుపులోనూ బాధలు పడుతూ పూర్తిగా మంచం పట్టినట్లు ఉండడానికి కారణం ఏమిటి? ఇదే స్థితిలో మరికొందరికి స్వల్పమైన అసౌకర్యమో. అదికూడా లేక పోవడమో ఎట్లా ఉంటుంది?

4. ఋతుకాలంలో వేదనలూ, వ్యధలూ లేకుండా చేసుకోవడం ఎట్లా కుదురుతుంది?

5. బాలురకు, బాలికలకు వేరువేరు రకముల వ్యాయామాలు ఉండాలంటారా "పురుషుల ఆటలు" అని చెప్పే వాటిలో పాల్గొంటే ప్రసవావయవము లకు హాని ఉంటుందా?

6. బలము ఆవశ్యకమైన వ్యాయామాలలో పాల్గొంటే పురుషులవలెనే బాలి కలుకూడా కండరాలు పెరిగి, రూపం మారి అసహ్యంగా కనిపిస్తారా?

7. బలము ఆవశ్యకమైన వ్యాయామాలు అభ్యసించిన తరువాత బాలికలు వివాహం మీదనూ, సంతానంమీదనూ అభిలాష కలవారైతే ప్రసూతి సమయంలో కష్టాలు వస్తాయా?

8. స్త్రీత్వ దృష్టితో బాలికలకు ఆదర్శప్రాయంగా ఉండే వ్యాయామ విద్య ఎటువంటిదిగా వుండాలి?

9. మన నవ్యజీవన మార్గంలో స్త్రీ పురుషులు ఎటువంటి పాత్రలు నిర్వహించాలి? వారి నడుమ ఎటువంటి సంబంధము వుండాలి?

10. స్త్రీ భౌతిక సౌందర్యానికి ఏది ఆదర్శంగా వుండాలి?

మీ ప్రశ్నలకు సమాధానం చెప్పేముందు మీకు ఒకటి చెప్పాలనివుంది. అది మీకూ తెలిసినదే. కాని విజ్ఞతతో జీవితం గడపడం నేర్చుకోవాలని వుంటే దానిని మీరెప్పుడూ మరచిపోకూడదు.

మన అంతరంగ వ్యక్తిత్వంలో మనము దైవభరితమైన జీవాత్మరూపంలో బ్రహ్మభావంతో వుండి ఆ దైవరూపంలోకి పరిణమించడానికి ఆ దైవాన్ని సమగ్రంగా ఆవిష్కరించడానికి ఇక్కడ వున్నాము అనే మాట సత్యము. ప్రస్తుత సమయంలో మన భౌతిక బహిరంగ వ్యక్తిత్వంలో, మన దేహంలో మనము ఇప్పటికీ జంతుత్వంలోనే, స్తన్యాజీవి రూపంలోనే ఉన్నాము అనే మాటకూడ సత్యమే. ఈ జంతుత్వం ఉన్నతస్థాయికి చెందినదే అయినప్పటికీ జంతుతత్త్వానికి సంబంధించిన ధర్మాలకు లొంగిఉండే జంతువుల వలెనే దీని నిర్మాణంకూడావుంది.

స్తన్యాజీవి రూపంలో స్త్రీ రూపమే శిశువును గర్భస్థంచేసి, కొంత కాలం మోసి, ఆ శిశువు తల్లి దేహమునుండి విడివడి స్వతంత్రంగా బ్రతకడం ప్రారంభించే క్షణంవరకు దాని దేహ నిర్మాణం చేస్తూ వుంటుంది అన్న విషయంకూడా మీకు తెలియనిది కాదు.

ఈ పనికోసం, శిశు రూప సృష్టికి ఉపయోగించే నిమిత్తం స్త్రీ దేహంలో, అదనపు రక్తాన్ని సిద్ధంచేసి వుంచింది ప్రకృతి. దీని వుపయోగం శిశురూప సృష్టి లేనప్పుడు నిరంతరంగా అవసరం కాకపోవడంచేత రక్తాధిక్యాన్నీ, దానివల్ల వచ్చే దుస్సహభారాన్నీ వారించడంకోసం ఈ అదనపు రక్తమును బహిష్కరించవలసివుంది. రజోదర్శనానికి ఇది కారణం. ఇది ఒక చిన్న ప్రకృతిధర్మం. ఇది స్త్రీ దేహనిర్మాణ పద్ధతివలన వచ్చిన ఫలితం. దేహ క్రియాకలాపంలో దీనికే అంత ప్రాముఖ్యం ఇవ్వవలసిన పనిలేదు. ఇదేమీ జబ్బుకాదు. ఇది బలహీనతకుగాని. నిజమైన అసౌఖ్యానికిగాని కారణంకాదు. అందుచేత మామూలుగా వుండే స్త్రీ, హాస్యాస్పదమైన సౌకుమార్యం లేనిదైతే, పరిశుభ్రతకు అవసరమైన ముందు జాగ్రత్తలు మాత్రం తీసికొని దీనిని గురించే ఆలోచించకుండగా, తనదైనందున కార్యక్రమంలో ఏ మార్పూ లేకుండగా, జీవితాన్నిగడుపుకోవచ్చు. మంచి ఆరోగ్యంలో వుండడానికి ఇది వుత్తమమైన మార్గము.

ఇంతే కాకుండగా మన దేహంలో మనం ఇప్పటికీ భీకరంగా జంతుత్వానికే చెందినవాళ్ళమని గుర్తించినాకూడా, ఈ జంతుభాగమే ఎక్కువగా కంటికి కనుపించి మిక్కిలి యథార్థంగా కనిపిస్తుంది. కనుక, దానికే మనం లొంగివుండక తప్పదనీ, దాని ప్రభావం మనమీద చూపించడానికి ఒప్పుకోవాలనీ, మనం ఎప్పుడూ అనుకోకూడదు.

దురదృష్టవశాన జీవితంలో చాలా తరచుగా ఇదే జరుగుతూ వుంటుంది. మనుష్యులు వారి భౌతిక వ్యక్తిత్వానికి, అధిపతులుగా కంటే, సేవకులుగానే వున్నారని రూఢిగా చెప్పవచ్చు. వ్యక్తి జీవితంలో సత్యం పూర్తిగా వేరొక విధంగా వుంది కనుక పైన చెప్పినదానికి విరుద్ధంగా వుండితీరాలి. మన

చైత్య వ్యక్తిత్వానికి ప్రధమ పరికరంగా మనలో ఎంతో కొంత దీప్తిని పొందిన బుద్ధిసంకల్పం వుంది. జంతురూప మానవునివలె కాక మనుష్యే తుగా, దివ్యత్వాన్ని అభ్యర్ధించే వాడుగా, జీవించడం ఎలాగో తెలిసి కోడానికి ఈ బుద్దిసంకల్పాన్నే మనం వుపయోగించాలి.

దేహానికి శక్తిహీనుడైన బానిసగా వుండడం మాని దానికి అధిపతిగా మారడమే పైన చెప్పిన సిద్ధికి మొదటి సోపానం.

ఈ లక్ష్యాన్ని నెరవేర్చుకోడానికి దేహసౌష్ఠవవిద్య మిక్కిలి కృతకృత్యంగా సహాయపడుతుంది.

ప్రాచీనకాలంలో గొప్పగా ఆదరించబడి ఆ తరువాత కొంచెం కొంచెంగా విస్మృతమైపోయిన జ్ఞానాన్ని మళ్ళీ సంపాదించడం ఒక శతాబ్దంనుండి జరుగుచున్నది. అది ఇప్పుడు మళ్ళీ ప్రబుద్ధమవుతూ వుంది. ఆధునిక శాస్త్ర ప్రగతితో దానికి ఒక కొత్త విపులత్వమూ, ప్రాముఖ్యమూ కలుగు తున్నాయి. భౌతిక దేహ విషయంలో సమ్యగ్వివేకంతో వ్యవస్థీకృతమైన వ్యాయామవిద్యా సహాయంతో ఆ దేహంపైన మనము ఎటువంటి అసాధారణ ప్రభావాన్ని పొందగలమో ఈ జ్ఞానం స్పష్టీకరిస్తుంది.

అచిరకాలంలో రానున్న మహాపరివర్తనములకు సన్నద్ధంగా వుండేటట్లు చేయడంకోసం భూమిమీద విస్తరించియున్న ఒక నూతనజ్యోతి, ఒక నూతనశక్తి చేస్తున్నపని మూలంగా ఈ పునర్నవీకరణం పొడచూపింది.

భూమిమీద ఆవిష్కరించడానికి కనిపెట్టుకొని వున్న నూతనశక్తిని

గ్రహించి ప్రసరించే సామర్థ్యం కలిగివుండేటట్లు మనదేహాన్ని రూపొందించే ఈ వ్యాయామవిధ్యకు అత్యంత ప్రాముఖ్యం ఇవ్వడానికి మనము ముందంజ వేయాలి.

అసలు విషయం చెప్పాను కనుక ఇప్పుడు మీరు వేసిన ప్రశ్నలకు సమాధానాలు చెపుతున్నాను.

1 ప్ర: ఋతుమతిగా వున్న బాలిక ఏ చిత్తవృత్తితో వుండాలి?

ఉ: చాలా సహజంగానూ, తప్పనిసరిగానూ వుండేదానిమీద ఎటువంటి చిత్తవృత్తి వుండాలో అటువంటిదే. దానికి వీలైనంత తక్కువ ప్రాముఖ్యం ఇచ్చి, దానిమూలంగా దేనిలోనూ మార్పు లేకుండా మామూలు జీవితాన్ని నడుపుకోవాలి.

2 ప్ర: ఋతుమతిగా వున్నప్పుడు వ్యాయామ విద్యలోని ప్రతిదిన కార్యక్రమంలో పాల్గొనవచ్చునా?

ఉ: ఆమె శరీరవ్యాయామానికి అలవాటుపడివుంటే తప్పకుండా పాల్గొనవచ్చు. దాని మూలంగా మానుకోవలసిన పనిలేదు. ఎల్లప్పుడూ మామూలు జీవితాన్ని గడుపుకొనే అలవాటు నిలుపుకొంటే ఆ వెనువెంటనే ఋతుస్థితిని గురించి పట్టించుకొనడమే వుండకుండా పోతుంది

3 ప్ర: ఋతుకాలంలో కొంతమంది బాలికలు వీపు దిగువభాగంలోనూపొత్తి కడుపులోనూ బాధలు పడుతూ పూర్తిగా మంచం పట్టినట్లు వుండ

దానికి కారణం ఏమిటి? ఇదే స్థితిలో మరి కొందరికి స్వల్పమైన అసౌకర్యమో, అదికూడా లేక పోవడమో ఎట్లా వుంటుంది?

ఉ: అది సహజ లక్షణం మీదనూ, చాలావరకు చదువుమీదనూ ఆధారపడి వుంటుంది. చాలా చిన్న అసౌకర్యాన్నికూడా పెద్దగా పట్టించుకొనడం చిన్నతనంనుండీ అలవాటువున్న బాలిక అయితే ఎంత చిన్న అసౌకర్యాన్ని గురించి అయినా పెద్దగొడవ చేస్తుంది. అప్పుడు ఓర్చుకో గలిగిన శక్తి అంతా పోవడమే కాకుండా ఏ చిన్న విషయమైనా దిగ జారిపోవడానికే అవకాశం కల్పిస్తుంది. చిన్నపిల్లలు ఎట్లా అనుకుంటారో అని ఊరకే ఆదుర్దాపడే తల్లిదండ్రులువుంటే ఇది మరీ ఎక్కువగా వుంటుంది. జీవితంలో అన్ని వేళలా తప్పించుకొనడానికి వీలు లేని ఇటువంటి చిన్నచిన్న అసౌకర్యాలనూ, ప్రమాదాలనూ ఎక్కువ లక్ష్యపెట్టకుండా కొంచెం దృఢంగానూ, ఓర్పుతోనూ వుండడం పిల్లలకు నేర్పితే వివేకవంతంగా వుంటుంది. ప్రశాంతంగా ఓర్చుకొనే ప్రవృత్తిని తాను అలవరచుకొని పిల్లలకు నేర్పడం వుత్తమం.

మనకు ఏదైనా బాధ వస్తుంది అని అనుకొంటే అది తప్పకుండా రావడం మనకందరికీ తెలిసినదే. తీరా అది వచ్చిన తరువాత దానిమీదనే మనస్సు లగ్నమైతే అది మరీ పెరిగిపోయి చిట్టచివరకు నలుగురికీ అలవాటైనట్లు "అబ్బ! భరించలేను" అన్నట్లుగా అవుతుంది. కాని కొంచెం సంకల్పబలం ధైర్యం వుంటే ఓర్చుకోలేని బాధ అంటూ వుండదు.

4 ప్ర: ఋతుకాలంలో వేదనలూ, వ్యధలూ లేకుండా చేసుకోవడం ఎట్లా కుదురుతుంది?

ఉ: పొత్తికడుపుకి బలాన్ని చేకూర్చి రక్తప్రసారాన్ని మెరుగుచేసే వ్యాయామాలు కొన్ని వున్నాయి. వీటిని వేళతప్పకుండా, బాధలు తగ్గిన తరువాతకూడా చేస్తూవుండాలి. ఎదిగిన పిల్లలకు ఈ రకపు బాధలు పూర్తిగా మిధున వాంఛల మూలంగానే వస్తాయి. వాంఛలు తొలగిపోతే బాధలూ తొలగిపోతాయి. ఈ వాంఛలు తొలగించుకొనే మార్గాలు రెండు వున్నాయి. మొదటిది సాధారణ మైనదే; అంటే తృప్తిమూలమైనది. (దానిని అట్లా అంటారు కాని వాంఛారంగంలో 'తృప్తి' అనడానికి యోగ్యమైనది ఏదీలేదు.) అంటే సాధారణ జంతుజీవితాన్ని గడపడం వివాహమూ, సంతానమూ, తరువాయి తతంగమూ.

దీనికి వాస్తవంగా వేరేమార్గం, అంతకంటె మంచిమార్గంవుంది; నిగ్రహము, వశీకరణము, పరివర్తనము; ఇది ఎక్కువ వుదాత్తంగానూ, పైదానికంటె కృతకృత్యంగానూ వుంటుంది.

5 ప్ర: బాలురకు బాలికలకు వేరువేరు రకముల వ్యాయామాలు వుండాలంటారా? "పురుషుల ఆటలు" అని చెప్పేవాటిలో పాల్గొంటే ప్రసవావయవములకు హాని వుంటుందా?

సమా: అందరి విషయంలోనూ, బాలురవలెనే బాలికలకూ. ఒక్కొక్కరికి వున్న బలాన్ని, సామర్థ్యాన్ని అనుసరించి వ్యాయామాలు ఒక వరుసలో పైకిపోవాలి. బలహీనంగావున్న విద్యార్థి ఒక్కసారిగా కష్టంగానూ, భారంగానూవున్న వ్యాయామాలు చేయడం మొదలు పెడితే అతని మూర్ఖత్వానికి అతనే బాధపడవచ్చు. కాని విజ్ఞతతో పురోగమించే శిక్షణతో బాలురు, బాలికలు అన్నిరకాల ఆటలలోనూ పాల్గొన

వచ్చును. ఈ విధముగా వారికి బలము, ఆరోగ్యము వర్ధిల్లుతాయి. శరీరానికి, అది స్త్రీ శరీరమైతేనేమి. బలము ఆరోగ్యము చేకూర్చు కోడం వలన ఎప్పుడూ హానిరాదు.

6 ప్ర: బలము ఆవశ్యకమైన వ్యాయామాలలో పాల్గొంటే పురుషుల వలెనే బాలికలు కూడా కండరాలు పెరిగి, రూపంమారి అసహ్యంగా కనిపిస్తారా?

ఉ : పెడదారి పట్టిన మనస్సుకి స్త్రీ 'అబల'గానో, 'తన్వి'గానో వుంటే ఆకర్షణ కలిగించేదిగా కనబడవచ్చు. కాని అది ప్రకృతి తత్త్వమూ కాదు, ఆధ్యాత్మిక సత్యమూకాదు, ఎన్నడైనా నీవు క్రీడారంగంలో వున్న స్త్రీల ఫొటోలు చూస్తే వారి శరీరాలు ఎంత చక్కని సొయగంతో నిండివున్నవో తెలుస్తుంది. కండరాల బలంకూడా వారికి వున్నదన్న విషయం ఎవ్వరూ కాదనలేరు.

7 ప్ర: బలము ఆవశ్యకమైన వ్యాయామాలు అభ్యసించిన తరువాత వివాహం మీదను, సంతానం మీదనూ అభిలాష కలవారైతే ప్రసూతి సమయములో కష్టాలు వస్తాయా?

ఉ : ఇంతవరకు ఆవిధంగా జరుగుతుందని నాకు తెలియదు. దానికి భిన్నముగా, బలాన్ని కండరాల పటుత్వాన్ని చేకూర్చే వ్యాయామాలలో శిక్షణపొందిన స్త్రీలు దుర్భరమైన గర్భధారణమునుండి, ప్రసూతి నుండీ ఎక్కువ తేలికగా బాధలు లేకుండగా బయటపడడం సువిదితమే.

పెద్దపెద్ద బరువులు మోస్తూ మైళ్ళకొలది దూరం నడవటానికి అలవాటుపడిన ఆఫ్రికా వనితలలో ఒక ఆమెను గురించి నేను ఈ క్రింది యదార్ధకథనం విన్నాను. ఆమె గర్భవతి. ఒకరోజున ప్రసూతి సమయం వచ్చేసరికి, ఆమె పైన చెప్పినట్లే నడుస్తూవుంది. దారిలో ఒక ప్రక్కన చెట్టుసీడను కూర్చుండి, ప్రసవమైన పిమ్మట ఒక అర గంట వేచి, మళ్ళిలేచి ఇదివరకున్న బరువుకు ఈ నూతన శిశువు భారాన్ని కలుపుకొని ఏమీ జరగనట్లు ప్రశాంతముగా తన దారివెంట వెళ్లిపోయింది. సంపూర్ణమైన ఆరోగ్యము బలము వున్న స్త్రీ ఎంతటి పనులు నిర్వహించగలదో నిరూపించే అద్భుతావహమైన ఉదాహరణమిది.

నలుగురూ చెప్పుకుంటున్న ప్రగతిని సాధించిన మనుష్యజాతికి సంబంధించిన నాగరిక ప్రపంచములో ఇటువంటిది జరగడానికి అవకాశం లేదని వైద్యులు అంటారు. కాని భౌతిక జీవితం దృష్టిలో ఆధునిక నాగరికత సృష్టించిన సౌకుమార్యము, బాధలూ చిక్కులూ మొదలైన వాటికంటె, పైనచెప్పిన కథలోవంటిదే సంతుష్టిని కలిగించే పరిస్థితి అంటే మనము కాదనగలమా?

అంతేకాకుండా, వైద్యులు మామూలుగా అపసవ్యపు విషయాలలోనే ఉత్సాహం చూపిస్తారు. చాలావరకు ఆదృష్టితోనే వారి తీర్మానాలు కూడావుంటాయి. కాని మన విషయంలో అది భిన్నంగా వుంటుంది. మనము సాధారణమైన దానిలోనుండి అనన్య సాధారణమైన దానిలోకి ఆరోహించగలము. కాని పెడసరానికి, హీనత్వానికి లక్షణమైన అపసవ్యంలోనుండి ఈ పని శక్యంకాదు.

8 ప్ర: స్త్రీత్వ దృష్టిలో బాలికలకు ఆదర్శప్రాయంగా వుండే వ్యాయామ విద్య ఎటువంటిదిగా వుండాలి?

ఉ: బాలురకంటె వేరుగా బాలికలకు వ్యాయామవిద్యలో ప్రత్యేకమైన ఆదర్శం ఎందుకు వుండాలో నాకు అర్ధంకావటంలేదు.

మానవ శరీరము సాధించగలిగిన వాటిని, సామరస్యాన్ని సాధించ గలిగిన వాటిని, బలాన్ని, కోమలత్వాన్ని, తెలివితేటలను, జవసత్త్వ ములను సహనాన్ని పెంపొందించి అవయవాలూ, ఇంద్రియాలూ చేసేపనులను అదుపులోపెట్టి వర్ధిల్లజేయడంకోసం చేతనాత్మక సంక ల్పానికి పనికివచ్చే సమగ్రసాధనముగా దేహాన్ని తయారుచెయ్యడమే వ్యాయామ విద్యాలక్ష్యము. మానవులందరికీ ఈ ప్రణాళికలో తుల్య మైన శ్రేష్ఠత్వంవుంది. బాలికలకు వేరుగా ఒక వ్యాయామ విద్య వుండాలి అనడంలో అర్థంలేదు.

9 ప్ర: మన నవ్యజీవన మార్గములో స్త్రీ పురుషులు ఎటువంటి పాత్రలు నిర్వ హించాలి? వారి నడుమ ఎటువంటి సంబంధము వుండాలి?

ఉ: అసలు వారిలో వారికి ఒక ఏభేదాన్ని కల్పించడం ఎందుకు? ఒకే జగదంబికకు సంతానమై, శాశ్వత దివ్యత్వం వైపుకు మాత్రమే ప్రయాణమై మిధునభావాన్నీ, కులమతజాతులనూ దాటి పైకివెళ్ళి, భగవంతుని లీలలో యోగ్యమైన ఉపకరణాలు కావడానికి ప్రయ త్నిస్తూ, సమానంగావున్న మానవత్వ సంపన్నులు మాత్రమే స్త్రీ పురుషులు.

10 ప్ర; రమణి భౌతిక సౌందర్యానికి ఏది ఆదర్శంగావుండాలి?

ఉ: అంగసౌష్టవములోని సంపూర్ణ సామరస్యము, బలముతో కూడిన మార్దవము, శక్తితో కూడిన లాలిత్యము, ఓర్పుతోకూడిన కోమలత్వము, ఈ అన్నింటినీ మించి దైవానుగ్రహముమీద ఉన్న అచంచల విశ్వాసానికీ, జీవితమునందున్న సంతుష్టితో నిండిన విస్రంభానికీ, ఆత్మ నిర్మలత్వానికీ ఫలితంగా వచ్చేదీ, ఏమార్పూ లేకుండా ఎక్కువతక్కువలు లేకుండగా వుండే శ్రేష్ఠమైన ఆరోగ్యము.

చిట్టచివరి మాట ఒకటివుంది. మీరందరూ ఇవి వినవలసివుంది. కనుక మీకు ఈ విషయాలన్నీ చెప్పాను. కేవలం వీటినే తు. చ. తప్పకుండా ఆచరించాలి అని చూడకూడదు. అట్లా చేస్తే వాటిలో వున్న సత్యం వేపైపోతుంది.

★ ★ ★

"కఠిన పరీక్షలు, అడ్డంకులు ప్రతివారికీ వున్నవే. కాని వాళ్ళొక్కొక్కరు వాని నెదుర్కొను విధానమునందు భేదమున్నది. అనగా వొకరు వానిని చిరునగవుతో యెదుర్కొన, మరొకరు వానిని అనవసరముగ ఆర్భాటపరచెదరు."

—— శ్రీమాత

# శ్రీమాత దర్శనం- 'వేదమూర్తి' వీక్షణం

(శ్రీ నారాయణ ప్రసాద్‌గారు వ్రాసిన "శ్రీ అరవిందాశ్రమంలో జీవితం"
Life in Sri Aurobindo Ashram అను గ్రంథమునుండి.)

భగవద్గీతపై ఆంగ్లంలో ఉద్గ్రంథద్వయ వ్యాఖ్య వ్రాసి జీవిత పరమావధిగా నిది ధ్యాసనాన్ని పెట్టుకొని, వేదార్థ వ్యాఖ్యాన పరంగా 30 ఉద్గ్రంథాలను వ్రాసి "వేదమూర్తి", "గీతాలంకార" "సాహిత్యవాచస్పతి" మొదలైన బిరుదాలతో విరాజిల్లిన వేదవేదాంగ ప్రస్థానత్రయ విద్వన్మూర్ధన్యులు, బ్రహ్మవిద్యా భాస్కరులు, కీ. శే. శ్రీ శ్రీపాద దామోదర సాతవలేకర్ మహోదయులు 29-7-1960న శ్రీ అరవిందాశ్రమానికి వచ్చి 17-8-1960 వరకు ఆశ్రమానికి అతిథిగా వున్నారు. 30-7-1960న ఆయన శ్రీమాతను దర్శించి ధ్యానంలో కొంతకాలం గడిపారు.

ఆశ్రమవాసులు ఇచ్చిన వీడ్కోలు పుచ్చుకొని స్వస్థలానికి వెళ్ళబోయే ముందు 93 ఏళ్ళ వయసులో వున్న ఆ పరిపక్వ వేదానుభవమూర్తి చెప్పిన విషయాలలో ఈ క్రిందివి కొన్ని భాగాలు.

"గడచిన 50, 60 ఏళ్ళనుండి నేను దేనికోసమై కలలు కంటున్నానో దానిని ఈ ఆశ్రమంలో సజీవరూపంలో చూస్తున్నాను. వేదయుగం తరువాత బహుశః ప్రప్రథమంగా, అటువంటి జ్యోతిర్మయమైన ఉద్యమం మళ్ళీఇక్కడ చిగిరిస్తున్నది. ఇక్కడ వున్న సాధన విధానమంతా వేదవిహిత రూపంలో వుంది. వేదాలలో బీజప్రాయంగా వున్నదంతా, ఏదో ఒక రూపంలో ఇక్కడ ఫలోన్ముఖంగా వున్నందుకు నా హృదయం పారవశ్యంతో పొంగి పోతున్నది."

'కుల విభేదాలను రూపుమాపడానికి తీవ్రప్రయత్నం చేసి కృతకృత్యత చేకూరనందుకు "మహాత్మగాంధి" విచారం వ్యక్తంచేసిన విషయం మన కందరికీ తెలుసు. కాని ఇక్కడ కులాన్ని గురించిన జాడమాత్రంకూడా లేదు. శ్రీమాత మూలంగా ఇక్కడ ఎంతమార్పు వచ్చింది! ఈ విషయం మానసికంగా అర్ధంచేసుకొని ప్రశంసాపాత్రంగా గమనించడం అంత కష్ట మైన విషయంకాదు. కాని బడిలో, క్రీడావనిలో అన్ని రంగాలలోనూ యువతీయువకులు కలిసిమెలిసి తిరగడానికి శంకాలవలేశమైనా లేకుండగా ఇచ్చిన స్వేచ్ఛను చూస్తే అది మాటలకూ, ఊహలకూ పైన ఎక్కడోవున్న అద్భుతంగా కనిపిస్తుంది. యువతీయువకులు సహ విద్యాభ్యాసము ఇక్కడ బడిలోగాని, క్రీడావనిలోగాని ఎటువంటి సమస్యకు చోటివ్వడంలేదు.

"శ్రీమాత దృష్టిలో స్త్రీ పురుషుల నడుమ భేదమన్న మాటయే లేదు. వాస్తవంగా ఇది ఒక గొప్ప నూతనయత్నము. అతి స్వచ్ఛమైన ఆధ్యాత్మిక సమాజాన్ని మూర్తీభవించడానికి శ్రీమాత ప్రయత్నం చేస్తున్నట్లు కనిపిస్తుంది. మిధునభావ కల్పితమైన భేదాన్ని వేదాలుకూడా గణించలేదు. ఆత్మకు ఆత్మకూ నడుమమాత్రమే సంబంధాలుండే సమాజాన్ని సృష్టించడం కోసమే

శ్రీమాత అభిలషిస్తున్నట్లు కనిపిస్తుంది. ఇక్కడ శారీరక బేధాలు లెక్కలోకి రావు. ఛిద్రాన్వేషణమే చేసేవాళ్ళకు అక్కడక్కడ లోపాలు కనిపించవచ్చు. ఈ ఆశ్రమం అంతా పరిపూర్ణంగా, ఏలోపమూ లేకుండగా వుందని నేనూ చెప్పడంలేదు. కాని వేద నిర్దిష్ట మార్గంలోనే ఇక్కడ ప్రయత్నం సర్వ స్వమూ జరుగుతున్నదని ఘంటాపథంగా చెప్పగలను. శ్రీమాత తలపెట్టిన పనులు ఎప్పుడో ఒక రోజున సుసంపన్నం కాగలవని నా దృఢవిశ్వాసం.

"ఇక్కడ దృశ్యరూపంలోకివస్తున్న ఆధ్యాత్మికతత్వాన్ని ఎవరైనాగుర్తించ గలరు. సన్యాసమే పారమార్థిక లక్షణమని వేదాలలో ఎక్కడాలేదు. వేదా లలో ఐశ్వర్యంకోసం, సమృద్ధికోసం, అగ్ని, శక్తి, తేజస్సు, ఓజస్సు మొదలైన వాటికోసం భౌతిక వస్తువులకోసం కూడా ప్రార్థనలు ఎక్కడ చూస్తే అక్కడ వున్నాయి. దారిద్ర్యంతో నిండిన దృశ్యంగానీ భౌతిక వస్తు వులను పరిత్యజించి కౌపీనాలుధరించి, దరిద్రునివలె ఏ చెట్టుక్రిందనో ముక్కు మూసుకొని రోజులు గడిపేవాళ్ళనుగాని వేదాలలో చూడాలంటే శక్యంకాదు. ప్రపంచాన్నీ, దాని సాంగత్యాలనూ విడనాడడం, పరాత్పరుణ్ణి గురించిన ధ్యానంలో పడి జడపదార్థంవలె రోజులు గడపడం మొదలైనవి వేదకాల జీవనసరణికి చాలాదూరమైనవి. వేదకాలంలో జనకునివంటి రాజులు సామ్రా జ్యాలను పరిపాలించారు. వశిష్ఠునివంటి మహర్షులు రాజులకు అండగా నిల బడి వారికి సలహాలనిచ్చేవారు. ప్రపంచాన్ని పరిత్యజించి, అరణ్యాలలో నివ సించడానికి పోయినవారిలో ఋషిశబ్దవాచ్యు లెవ్వరూలేరు. భారతదేశాన్ని కప్పివేసిన గాఢ తిమిరదశలోనే ఇటువంటివన్నీ జరిగినయి. ఈనాడు శ్రీమాత అభ్యుదయాన్ని స్వీకరించి అకించనత్వాన్ని నిరాకరించడం ఎంతో మోదావహమైన విషయం. శ్రీమాత ప్రపంచాన్ని దాని గతికి వదలివేయ డానికి సుముఖంగాలేదు. పైగా ఈ ప్రపంచాన్ని అధ్యాత్మికత్వానికి వశపడిన

సకల సంపత్సౌభాగ్యములతో నింపివేయడమే ఆ దివ్యమాతకు అభిలష ణీయం. ఈ ప్రపంచాన్నే ఒక నూతన పరిణామంలోకి తీసుకుపోవాలి అని ప్రయత్నించే ఈ ఆశ్రమంలోనే వేదయుగం మళ్ళీ అంకురిస్తున్నట్లు ఎవరి కైనా స్ఫురిస్తుంది. ఏ భౌతిక వస్తువునూ విడనాడడంగాని, వికటంగా చూడ డంగానీ ఇక్కడ పనికిరాదు. ప్రతి వస్తువూ దాని యోగ్యస్థానంలో, ప్రతి వ్యక్తి తన యోగ్యస్థానంలో ఉండేటట్లు చేయడం ఇక్కడ ఒక్కచోటనే జరుగుచున్నది.

"భారతదేశ పతనానికి నిజమైన కారణమేమిటో మీకు తెలుసునా! ముఖ్యంగా రెండింటివలన ఆపతనం సంభవించిందని నా ఊహ."

"ఆధ్యాత్మిక జీవితంకోసం భౌతిక జీవితాన్ని తృణీకరించిన తత్ఫలంగా పనిపాటులకంటె ప్రారబ్ధానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాము; మన దేశపు స్త్రీలను అంటే సంఘంలో అర్ధాంగరూపాన్ని, చైతన్యం పోగొట్టిన జీవ రాశిగా అణగార్చి వేశాము."

"ఎంత దౌర్భాగ్యము! శక్తిని స్త్రీ స్వరూపంగా ఆరాధించడానికి ఏదేశం కారణమైనదో, పురాణాలలోని పుటలలో పురుషరూపంలోవున్న దేవతలకు నాలుగునుండి ఎనిమిదివరకు మాత్రమే చేతులున్నట్లు, ఏ దేశం దర్శించిందో, అదే దేశం. స్త్రీలు పురుషులకంటె తక్కువ స్థాయిలోనివారనీ, వారు వేదా ధ్యయనం చేయడానికి వీలులేదనీ, అన్నిటికంటె తుచ్ఛంగా వారిని నాలుగు గోడల నడుమ, చెఱపెట్టినట్లుంచి, సంఘంలో వారి స్థితిని వంటకత్తెలరూపం లోకి, పిల్లలను కనే యంత్రాల రూపంలోకీ దిగజార్చి వేయడం నిజంగా ఎంత దౌర్భాగ్యము!!"

"సంవత్సరాల తరబడిగా నేను చేస్తున్న ప్రార్థనమేమంటే: ఓ భగవానుడా! పూర్వకాలంలోవలే మా మహిళల నందరినీ వారి అర్హస్థానంలోకి పైకెక్కి వచ్చేటట్లు అనుగ్రహించు తండ్రి! —అని."

"ఈనాడు మన దేశంలో మహిళాజన పురోగమనం అనే నినాదం ఆ మాటకు ఉన్న అర్థానికి తగినట్లు లేదు. ఈ ఆశ్రమంలో మాత్రమే నిజమైన పురోగమనం జరుగుతున్నట్లు మోదావహ చిహ్నాలు కనిపిస్తున్నాయి. సంఘంలో స్త్రీల స్థాయిని పైకి తీసుకవోవడం శ్రీ మాత తలపెట్టిన ముఖ్య కరణీయాలలో ఒకటి అని స్పష్టంగా తెలుస్తున్నది."

"వయస్సునుబట్టి మనుష్యులను యువకులనిగానీ, వృద్ధులనిగానీ అనడానికి వీలులేదు. కాలమనే బాటమీద జీవితమొక పయనంగా నిరంతరం ముందునడక నడుస్తూ ఉన్నవాళ్ళు ఎవరైనా యువకులే. నడవలేక నిలువబడిన వాళ్ళంతా వృద్ధులే. వేదాలను అనుసరించి చూస్తే వృద్ధాప్యం అన్నది 116 ఏళ్ళ వయస్సు తరువాత ప్రారంభమౌతుంది. 80 ఏళ్ళ వయస్సు వస్తేనే నడి యౌవనంలోకి వచ్చినట్లు లెక్క. 116-120 ఏళ్ళ వయస్సులోనే ముసలితనాన్ని లోపలికి అడుగుపెట్ట నివ్వడం. అంతకుముందు మృత్యుదేవత దిగి వచ్చినా సరే, నిజమైన సాధకుడు తన జీవితమంతా ఒక ఎడతెగని యజ్ఞమనీ దైవానికి ఈ రూపంలో తాను సమర్పించుకొంటున్న నివేదన ఆపడానికి వీలులేదనీ వక్కాణించి ఆ మృత్యుదేవతను బయటకు పొమ్మనిచెప్పే అర్హత ఉంది."

"మహాభారత యుద్ధంనాటికి అర్జునుడి వయస్సు 72 ఏళ్లు అంటే అప్పటికి ఆయన మంచి యౌవనంలో ఉన్నట్లు లెక్క. వారందరిలోనూ వృద్ధు

డైన భీష్ముని వయస్సు 170 ఏళ్ళు. పాతకాలపు సంగతి వదలిపెట్టండి. 1400 ఏళ్ళ క్రితం భారతదేశానికి చైనా యాత్రికులు ఇక్కడ పట్టణాలలో ఎక్కడ చూచినా 140 ఏళ్ళ ప్రాంతపు వయస్సు వున్నవాళ్ళు చాలామంది కనిపిస్తున్నారని వ్రాసిన వ్రాతలు అందరికీ తెలిసినవేకదా!"

శ్రీ సాతవలేకర్ తిరిగి స్వగృహానికి చేరుకున్న తరువాత ఆశ్రమానికి ఇలా వ్రాశారు—

"ఎప్పుడో ఇల్లువదలి ఎక్కడికో, ఎంతదూరమో పోయినట్లు నేనిక్కడ ఆవేదన పడుతున్నాను. ప్రతి రోజూ ఉదయం 'బాల్కనీ' మీదకు వచ్చిన శ్రీమాత దర్శనం చేస్తున్నట్లుగా అనిపిస్తుంది. శ్రీమాత సాన్నిధ్యంలోనే నేనున్నట్లు భావించకపోతే క్షణం గడవటం లేదు."



* * *

"మనము చేయగలిగిన దానిని దేనిని అలక్ష్యపరచకున్నను; బ్రహ్మాండమైన అపరాత్పరశక్తికి— ప్రతి జీవియందునను, ప్రతి వస్తువునందునను, సర్వాంతర్యామియైవున్న ఆ వొకే ఒక దైవశక్తికి పసిబిడ్డల నమ్మకముతో మనలను అర్పించుకొనుట యెట్లో తప్పక తెలుసుకొనవలయును.

— శ్రీమాత

# అగ్నికుండము

"శ్రీమాతా.... చిదగ్నికుండ సంభూతా.... దేవకార్య సముద్యతా...."

"పరమేశ్వర దివ్యమహాప్రేమ స్వరూపిణినై లోకమున మానవుల మధ్య వెలసెదనుగాక! ఆదివ్య మహాప్రేమ అత్యంత శక్తిమంతమై, అనంతమై, అగాధమై సృష్టి యందన్ని కార్యములందును, అన్ని లోకములం లందును విలసిల్లుగాక! అట్టి దివ్య మహాప్రేమమూర్తినై యుండగలుగుటకే, ఓ పరమేశ్వరా! నిన్ను ప్రార్థించుకొనుచు మొరలిడుచున్నాను. సృష్టిలో అన్ని కార్యములందును, అన్ని లోకములందును, అనంతమైన, అగాధమైన అత్యంత శక్తిమంతమైన ఈ దివ్య మహాప్రేమచే, ఈ దివ్య మహాప్రేమ యందు పూర్ణాహుతి యైపోదునుగాక . నీ మహనీయ దివ్య ప్రేమాగ్నికుండ జ్వాలారూపిణిగ, ఓ ప్రభూ, నన్ను రూపాంతర మొందించుము, నీతో నైక్యముచెంది, ఒక్కటియై దివ్య చిదగ్నికుండ సంభూతనై, నీ దివ్య మహా ప్రేమాగ్ని జ్వాలారూపిణినై ఈ భూమినంతటిని పవిత్రముజేసెద.

"అనంతముగా— నీదివ్య మహాప్రేమ స్వరూపిణినై యుండుట యెంతటి మహద్భాగ్యము!"

— శ్రీమాత

(శ్రీమాత ప్రార్థనలు-ధ్యానములు, ఆగష్టు 27, 1914-ఆధారముగా)

# నిరీక్షణ

అయినను హృదిలో శ్రద్ధను పదిలపరచుకొనుచు అనుకొందుము,
"ఓహో. మనమొరాలకించి తప్పక వచ్చును ఒకనాడాతడు,
మన జీవితములను నూతనముగ తీర్చిదిద్దు నొకనాడాతడు
'ఓం శాంతి' యటంచు శాంతిమంత్రపఠనము గావించు
ప్రస్తుత ప్రపంచసృష్టి విధానమున పరిపూర్ణత సాధించు.
విశుద్ధాత్మ నిత్యపరంధామ వికుంఠద్వారముల విడనాడి
ఆర్తితో ప్రార్థనలు సలుపు ఈ ప్రపంచము నుద్ధరింప
మనుజ మధ్యమున భూమిపై నవతరించునాతడు.
ఆత్మ మోక్షదాయకమగు అనంత సత్యధర్మముల స్థాపించు
ఆత్మ యోగాగ్ని జ్వాలా పవిత్ర పరిశుద్ధాత్మానందము ప్రసాదించు
అవ్యాజ పరమ కృపామయ వరదాఒభయ దివ్యహస్త-ప్రేమ బలము నొసగు
ఆత్మ. మహాసౌందర్య భీకరాచ్ఛాదనను తొలగించునాతడొకనాడు,
ఆత్మ దివ్యసన్నిధియందు స్పందించు హృదయమున ఆనందము కలుగజేయు
ఆత్మ దివ్యతేజోమయానంద నిగూఢ చిన్మయ దేహమును వ్యక్తముజేయు."

(సావిత్రి) —శ్రీ అరవిందులు

ఆదిత్యమండలమధ్యస్థా! సూర్య—సావిత్రీ! మిరామాత!
ఆదిమధ్యాంతరహితా! అనంతా! ఆద్యా! అరవింద—మాత!
మహోజ్జ్వల స్వర్లోక — సిందూర తిలకాంచితఫాలతలా!
తపచ్ఛిద సూర్యతేజో — పథ సర్వజనవందిత దివ్య పదా:
ప్రత్యంగ నిత్యనూతన ప్రకాశమాన దివ్యజ్యోతిర్మయ శరీరా!
తల్లి, నీ కడకంటిచూపుల క్రొత్త మెరుపులు మెరయు;
మాత, నీ మృదుపదమంజీర మధురధ్వని శాశ్వతపద పల్లవి;
నీ సర్వజగన్మోహనానంద దివ్యమందహాస వశీకృతములై
మా భక్త హృదయములు నీ పదసన్నిధి ఆత్మసమర్పణము చేసికొను.
నీ దివ్యామృత మాతృస్పర్శచే పరమ కృపాశీస్సులు వర్షించు సర్వత్ర.
నీ మహనీయ పదనారవిందము పరమకరుణాపూరితమై ప్రకాశించు.
నీ మహోజ్జ్వల దివ్యపదారవిందములు సర్వజన
నిత్యసులభ శరణ్యములగు!

బ్రహ్మాండ జననీ! మిరామహాదేవత
ఆత్మోద్ధారకమగు నీ దివ్యశక్తి లేక
ఈ విశ్వమంతయు ఏదిక్కు లేనిదగు.
ధరపై నీ దివ్య సన్నిధి
అసత్యాఽధర్మముల నిర్మూలించు.

జయోస్తు! విజయోస్తు!! జయదాయినీ!!! విజయోస్తు!!!!
శ్రీ మహారాజ్ఞి! పరమేశ్వరి! సర్వలోకపాలినీ!
శ్రీ మాత! నీకు వందనములు నిష్కళంక!

నాటి నేటికి మరియు యేనాటికైన
మాతశక్తిని మనమున మరువలేము
భూమి భారతిగన్నట్టి పుణ్యవశత
అవతరించెను జనులకు నడలుదీర్ప
యోగమార్గాన చక్కగా సాగిపోవ
రమ్యపథమును జూపిన రాజసముడు (యోగి)
అభినుతింతు నరవింద నాత్మలోన—

ఏమితేజము కన్నుల ఎంత వెలుగు
ఏమి లోకాల చూచెనో ఎవరికెఱుక
ఎంత పుణ్యమ్ముగాంచెనో వింతవిధము
ఆత్మశక్తిని దీపించె అవనియందు—

వేద వేదాంగ గీతల వెదకి వెదకి
గొప్ప భావాల జనులకు విప్పిచెప్పి
తపము యోగము సాధించి ధన్యుడయ్యె
మనల నడిపింప నమకట్టి మంచిత్రోవ—